# కవన మందాకిని

(కవితా సంపుటి)

డా॥ ఎస్. శరత్‌జ్యోత్స్నారాణి

KAVANA MANDĀKINI
(Kavita Samputi)
**Dr. S. Sarat Jyothsna Rani**
Reader, Dept. of Telugu
University of Hyderabad
Central University P.O. 500 046
A.P.



| | | |
|---|---|---|
| Copies | : | 500 |
| Published | : | October 2001 |
| Price | : | Rs. **50/-** |
| Cover Design | : | **Sri Chidambaram** |
| For Copies | : | **Visalandra Publishing House**<br>All Branches<br><br>**Navodaya Book House**<br>Opp. Arya Samaj Street<br>Kachiguda, Hyderabad. |
| Published by | : | **V.V. Ramana**<br>Sri Sai Krupa Aprtments<br>Flat No. 101<br>Ram Nagar Gundu<br>Vidyanagar<br>Hyderabad<br>Phone : 040 - 7075017 |
| Composed & Printed at | : | **Sri Sai Shamili Graphics**<br>Golnaka, Hyderabad.<br>Ph. 040- 7561442 |

# అంకితం



మాటలలో తియ్యదనం
చేతలలో మంచితనం
చెదరని చిరునవ్వు
తరగని ఆత్మీయతను
నింపుకున్న నిలువెత్తు మానవతావాది,
'నవసభా సమ్రాట్'
శ్రీ సి.ఎన్. గోపినాథ్ రెడ్డి గారికి,
ఈ 'కవన మందాకిని'ని అంకితమిస్తున్నాను.

- శరత్ జ్యోత్స్నారాణి

# వరుసలో...

# స్వీకృతి

'కవనమందాకిని' కవితా సంపుటిని నాకు అంకితమిస్తానని డా॥ శరత్‌జ్యోత్స్నా రాణిగారు అన్నప్పుడు, చాలా సంతోషించాను. గంగా ప్రవాహంలా స్వచ్ఛంగా, మాట్లాడే మంచి వక్త. మనిషిని, మానవత్వాన్ని ఆకాంక్షిస్తూ, సమాజ అభ్యున్నతిని ఆశిస్తూ మంచి కవిత్వం రాస్తుంటారు. ఈ కవితా సంపుటి నిండా మానవత్వం పరిమళిస్తుంది. మానవత్వానికై జ్యోత్స్నా గారి స్పందన విన్పిస్తుంది.

సమాజంలో భిన్న మనస్తత్వాలుగల వ్యక్తులు ఉంటుంటారు. సమస్యలూ ఉంటుంటాయి. కానీ, సమస్యలకి భయపడకుండా స్పందిస్తూ, పరిష్కారమార్గాలు అందిస్తూ, మానవ కల్యాణానికై ఆరాట పడేవారు తక్కువగా ఉంటారు. వ్యక్తి అభివృద్ధిని ఆశించేవారు, వ్యవస్థ శాశ్వత ప్రయోజనం గురించి ఆలోచించేవారు కూడా అరుదే! కానీ, శరత్‌జ్యోత్స్నా రాణి గారి కవితలనిండా సమాజంలో బాధలకు, కష్టాలకు గురయ్యేవారిపట్ల సహానుభూతి కన్పిస్తుంది. ప్రస్తుతం తెలుగు సాహిత్యంలో ఎక్కువగా ఆదరింపబడుతున్న వచనంలోనే ఈ కవిత్వం రచించటం వల్ల, రచయిత్రి అందించే సందేశం సామాన్యులకు సహితం, అందుతుందనడంలో సందేహం లేదు. సరళమైన శైలిని ఎన్నుకోవడంలో కూడా సాహిత్య ప్రయోజనాన్ని లోతుగా అర్థం చేసుకోవడం వల్లనే అనిపిస్తుంది. సాహిత్యం మానవ స్వభావాన్ని గొప్పగా, ఉన్నతంగా తీర్చిదిద్దుతుంది. శాశ్వతమైన నైతిక విలువలు పెంపొందింపజేస్తుంది. అందుకనే, వెయ్యేండ్ల చరిత్ర ఉన్నా నేటికీ తెలుగు సాహిత్యం నిత్య నూతనంగా పరిమళిస్తున్నది. వివిధ ప్రక్రియల్లో ప్రకటితమవుతూనే ఉంది. ఇదొక పవిత్రధార. 'కవన మందాకిని' జ్యోత్స్నగారు అందిస్తున్న కవిత్వధార. ఇవన్నీ సమాజానికి రహదారిని సిద్ధం చేయడంలో సహకరిస్తుంటా యనడంలో సందేహం లేదు.

- సి. ఎన్. గోపీనాథ్ రెడ్డి
ఐ.పి.ఎస్.

Grams : "TELVERS"

Phone : Off : 040-3234815
040-3236911
Res : 040-7037585
Fax : 040-3236045

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
POTTI SREERAMULU TELUGU UNIVERSITY

Prof. N. Gopi
M.A., Ph.D.
VICE-CHANCELLOR



Lalitha Kala Kshetram,
Public Gardens
HYDERABAD - 500 004 (A.P.)

తేది 16-10-2001

# కవితా శరచ్చంద్రికలు

డా॥ ఎస్. శరత్‌జ్యోత్స్నారాణి నిరంతరం సాహిత్య చంద్రికలను పూయిస్తున్న కాలమిది. పైగా ఇది కవితా ఋతువు, పండితురాలిగా, అధ్యాపికగా నిరూపించుకున్న జ్యోత్స్న రెండో కవితాసంపుటి 'కవన మందాకిని'. 'కొత్త పాట'లో పలుకులు నిరూపించుకొని ఇప్పుడు మందాకినిగా ప్రవహిస్తున్నది.

ఇందులోని కవితల్లో ఆర్తి ఆర్ద్రంగా వినిపిస్తుంది. 'అగ్నిపాతం' కవితలో ఆటవిక ప్రవృత్తికి అడ్డుకట్ట వేయమని గర్జిస్తుంది. ఆడపడుచుల గుండెలు ఆర్ద్రంగా మారితే 'ఓదార్చేవారేరి? ఈ లోకంలో' అంటూ ఉగాదిని ఆహ్వానించ లేని నిస్సహాయతను వ్యక్తం చేస్తుంది. హైదరాబాద్ విమోచన·దినోత్సవ సందర్భంగా రాసిన కవితలో త్యాగధనులకు అశ్రుతర్పణం చేస్తుంది. 'శంబూకుల శిరస్సుల మీద 'నల్లవాడి' పాదం నర్తిస్తోందని వాపోతుంది.' 'అంగడిలో అన్ని ఉన్నాయి కాని ఆత్మీయతానురాగాలు తప్ప' అని ఆప్యాయత కోసం ఆరాటపడుతుంది. ఈ సంపుటిలో కెల్ల 'ఇది ఉత్తమ కవిత'.

జ్యోత్స్న కవితల్లో మంచి ఊహలకు లోటు లేదు. అమరనాథుని శూలం దిగి మంచు మరింత పవిత్రమైందని అంటుంది. పత్తిరైతుల దైన్య స్థితికి చలించే కవయిత్రి. కోయిలపాటను తన కవితకు పల్లవిగా చేసుకొని సందడి పడుతుంది.

అన్నట్టు నానీలనూ ఓ పట్టుపట్టిన ఈ కవయిత్రి నావీ, నీవీ వెరసి మనవి అనిపించే కవితల్ని ఈ సంపుటిలో సమకూర్చారు.

నిరంతర సాహిత్యవ్యాసంగం, సాహిత్య కార్యక్రమాల నిర్వహణ అందరి హృదయపు వాకిళ్ళల్లో ఆత్మీయతా తోరణాలు కడుతూ తన వ్యక్తిత్వాన్ని నిర్మించుకుంటున్న జ్యోత్స్నారాణి, మరిన్ని మంచి రచనలతో పాఠక హృదయలోకంలో సుస్థిరస్థానాన్ని పొందాలని హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను.

- ఎన్. గోపి

'కళాప్రపూర్ణ' డా॥ పోతుకూచి సాంబశివరావు
అధ్యక్షులు 'విశ్వసాహితి'
కవాడిగూడ, సికింద్రాబాద్ - 500 080.

# మందాకినిలో జ్యోత్స్నవెలుగులు

వాగు, సెలయేరు, ప్రవాహం. నది!
ఇవన్నీ పారే జలాలకు 'ప్రతీక'!
మందాకిని పారుతూనే,
గాంభీర్యం, మందగమనం

స్వచ్ఛత వైశాల్యం నిండు తనం తొణికిస లాడుతాయి. కవితా మందాకిని శరత్ జ్యోత్స్నతో వెలుగులు నింపుకుని లావణ్యంతో తొణికిస లాడుతుంది.

శరత్‌జ్యోత్స్న ఇదివరలో అనేక గ్రంథాలు రచించారు. అందులో కవితా సంపుటులు ఉన్నాయి.

మనిషి ఎదిగిన కొలదీ మనస్సులు ఎదగాలి.
మనస్సు ఎదిగిన కొలదీ అక్షరం ఎదగాలి.
అక్షరం ఎదిగినకొలదీ భావం ఎదగాలి.
భావం ఎదిగిన కొలదీ అనందం పెరగాలి.

శరత్ జ్యోత్స్న కవితల్లో యీ పరాకాష్ట, ఆనందం కనిపిస్తుంది. చదివిన కవితను మరోసారి భావ మననానికి, బాధ ఉపశమనానికి, స్వగతజీవిత గతుల విశ్లేషణకూ మరోసారి చదవాలనిపిస్తుంది. ఈ మేర రచనా రీతిలో భావస్పందన ఒకలోతైన ఆకర్షణ.

"సంధి వచనాలతో కాలాన్ని
సర్దుబాటు చేస్తున్నాం"

కవయిత్రి, ప్రవచించిన యీ సూక్తి విశ్వజనీనమైంది. అన్ని రంగాలలో ఇది ఒక రాగంలా వ్యాపించింది. మానవ జీవితసారం అధునిక యుగంలో ఇదేనని చెప్పిన యీ ప్రవచనం ఒక విప్లవం. ఒక విశ్లేషణ, ఒక గమ్యం - ఒక హెచ్చరిక.

*"నీ చుట్టూ భ్రమరంలా తిరిగాను*
*పెదవి విప్పని నీ మౌనం*
*ప్రతిచోటా అవే చిరునవ్వులు*
*మానబోతున్న గాయాన్ని*
*మళ్ళీ వెతుకుతున్నావు"!*

ఆధునిక ప్రేమ పద్మవ్యూహాలలో అబేధ్యమైన అంతరంగం మథనం ఇందులో కనిపిస్తుంది...భగ్న హృదయంతో అక్షరాల కన్నీళ్ళు జలజలా ప్రవహిస్తున్నాయి. మూగవోయిన గొంతులో అగ్నికీలల ఆరాటం కనిపిస్తుంది. మాటల వెనుక మహోగ్రమైన మానసిక అలజడి కనిపిస్తుంది.

*"ఓదార్పులేని నా దేహం*
*నిలువెల్లా నీరై కరగిపోతుంది"*

'కీట్స్' శోకం 'కృష్ణశాస్త్రి కన్నీటి కెరటాలు' కరుణశ్రీ 'విలాపం'. ఇవన్నీ మూర్తీభవించిన వినూత్న భావం ఈ కవితా పదాలలో కనిపిస్తుంది.

'అతడు', ఈ శతాబ్ది మహర్షి' కవితల్లో కవనాలు కపటనాలుక లీలా వినోదం పెదాలపై తేనెతో కుక్షిలో విషంతో కులికే స్వార్థపర క్రూరులను సత్యవిశ్లేషణ చేశారు. హృదయంలో ఆ చిత్తం మనిషిని హత్తుకుని పదే పదే హెచ్చరికలు చేస్తూ, సుదూర తీరాల గమ్యానికి సన్మార్గ దర్శనం కలిగిస్తాయి.

***"కలహానికి***
***ఆయుధం కావాలా!***
***పలుగులాంటి***
***పలుకే వుండగా"!***

నారదుడు పాత్రలోని కొంత సారాంశం

అంతర్జాతీయ రాజకీయాలలో అంతర్గతమైన దౌత్యచర్చలు కోర్టు కేసుల్లో మూల బిందువు - తనకవితలు ఒక ఆయుధంగా కవయిత్రి పేల్చిన బాంబు!

దేశభక్తి, తెలుగుతేజం ఇజాలమోజులు గజగమన కవితా ధారలు. రాజకీయ సత్యాలు హృదయాలు రంగరించే విశ్వజనీన సూక్తులు ఈ 'మందాకిని'లో కెరటాల అలల్లా అందంగా కదులుతున్నాయి.

శరత్‌జ్యోత్స్న మాటలో, నడకలో వేగం - ఆలోచనలో, అవగాహనలో

అనంతం. ఆత్మీయతలో అపూర్వం - సూటి మాటల్లో మేటి. ఆమె జీవితం స్వచ్ఛ గమనం, గాంభీర్యం. భావసంపద వీరి కవితల్లో కూడా తొణికిసలాడు తున్నాయి.

వచన కవితలు వ్రాయడం ఈ రోజుల్లో సులువే! కాని కవితలుద్వ్యక్తి ప్రతిబింబాలు గా అరుదుగా కనిపిస్తాయి. కవితలు చదివితే కవయిత్రి కళ్ళలో మెదులుతుంది. ఆమెనవ్వు, ఆగ్రహం, ఆనందం, విషాదం, చీత్కారం, సత్కారం - అన్నీ యీ కవితల తెరల వెనుక నీలి నీడల్లా కనిపిస్తాయి. కవికి అక్షర బలం, భావబలం కావాలి. ఈ రెండు జ్యోత్స్నకు భుజకీర్తులు.

ఈమె కవితా కీర్తి సోపానాలు. 'కవన మందాకిని' ఆధునిక కవితా రంగంలో కొత్త కదలికలు సృష్టించగలదని నా విశ్వాసం. కవయిత్రికి నా శుభాశీస్సులు!

'కళాప్రపూర్ణ'
*- డా॥ పోతుకూచి సాంబశివరావు*

"కవి కౌస్తుభ"
"భారత్ భాషా భూషణ్"
డా॥ ఆచార్య తిరుమల
301, నందిని కాంప్లెక్స్,
మోజంజాహి మార్కెట్,
హైదరాబాదు - 500 095
ఫోన్ : 461 9066

# జ్యోత్స్నాతపం

ఆధునిక సామాజిక జీవన సమస్యల్ని అందంగా చిత్రించటమే కవిత్వమైతే ఆ పనిని కవులకంటె వార్తాపత్రికలే యెంతో బాధ్యతాయుతంగాను, నిజాయితీగాను చేస్తున్నాయి. కవి ధర్మం అంతటితో ఆగితే అతడు వార్తాహరుడే అవుతాడు. కానీ కవి కాలేడు. కవి ఆలోచన తపస్సు కావాలి. దాని ఫలితంగా కవితలో సమస్యాపరిష్కారం కనిపించాలి. అది ధ్వని పూర్వకంగా ఉంటే ఇంకా హృద్యంగా ఉంటుంది. ఎందుకంటే - సత్యానికి కవిత్వం చరిత్రకంటె దగ్గరై శివం సుందరం అవుతుంది కాబట్టి. ఆధునిక జీవితానికి స్టిల్ ఫోటోగ్రఫీ లాంటి శ్రీశ్రీ మహాప్రస్థానంలో కూడా కావల్సినన్ని సమస్యలున్నాయే తప్ప పరిష్కార మార్గాలు లేవు. ఆ పనిని అత్యాధునిక కవిలోకంలో కొంతమంది నిర్వర్తిస్తూ వుండటం ముదావహం. వారిలో డా॥ శరత్ జ్యోత్స్నారాణి గారు ఒకరు. ఈ సంపుటి చదివిన తర్వాత నాకలా అనిపించింది.

కవయిత్రిగా, కావ్య పరిశోధకురాలుగా, కళాపీఠ నిర్వాహకురాలుగా, వక్తగా, సుహృదయ వ్యవహర్తగా తమ ప్రజ్ఞాపాటవాల్ని బహుముఖీనంగా ప్రదర్శిస్తూ కీర్తిమంతురాలవుతున్న జ్యోత్స్నారాణి గారు రచించిన యీ సంపుటిలో నవత - మమత - మానవతలు ముప్పేట త్రాడులా అల్లుకుని దీని ధృఢత్వాన్ని ద్విగుణీకరిస్తున్నాయి. ఆమె నిర్భీక ప్రవృత్తిని, పరిణతిని, అభ్యుదయ శీలాన్ని ఆమ్రేడిస్తున్నాయి.

ఈ సంపుటిలో విషయ వైవిధ్యం చాలా వుంది. దేశభక్తి, మానవతానురక్తి బొమ్మ-బొరుసుల్లా వున్నాయి. అన్నిటా జ్యోత్స్నగారి స్త్రీ హృదయం

ంతస్స్రూతంగా ప్రవహించింది. అన్యాయాన్ని, దుర్మార్గాన్ని, మనిషిలోని
్వంద్వవైఖరిని చూచి మండిపడే ఆమె మనస్తత్వం బావుటాలా ఎగిరింది.
ఃమె వచశ్శీలంలో పూలతావితో అగ్నిఖడ్గం మెరిసింది.

'అంతఃశత్రువు'లో అమాయక ప్రేమ 'కాలాగ్ని'లో మనిషిద్వంద్వవైఖరి,
ఃసూయలు 'అగ్నిపాతం'లో

"జనారణ్యంలో జూలు విదిల్చే
మృగాన్ని మట్టుపెట్టండి" - అంటూ

పురుషాధిక్యాన్ని మట్టుపెట్టే పరిష్కారం. 'అతడు' కవితలో చేతల్తో
)షాన్ని తినిపించే మనిషి మీద ఎత్తిపొడుపు వర్ణనలతో బాటు 'నగరంలో ఓ
ఎల్లి', 'కన్నీటిపూలు', 'వృక్షవిలాపం', 'విషాద స్వప్నం' మొదలైన కవితలు
చూస్తే జ్యోత్స్న గారి హృదయమేమిటో అర్థమవుతుంది.

ఆమనికి దూరమై వైధవ్యాన్ని అనుభవిస్తున్న ఊరు ఆమెకు
కనిపిస్తుంది. జ్ఞాపకం, గాయపడ్డ గీతంలా వినిపిస్తుంది. పేదరికం పల్లవించే
ప్రజలకు వేయిపుటల్లో మానవత్వాన్ని పొదిగి, మట్టి మనిషిని మాత్రం నేలపై
పడవనీయని కవిదొంగల్ని గూర్చి హెచ్చరిస్తుంది. ఈ నగరాల అంగడిలో
అన్నీ ఉన్నాయి ఆత్మీయత, అనురాగాలు తప్ప' అని ఎలుగెత్తి చాటుతుంది.
మనిషి మనుగడకు మొదటి మెట్టు మానవత్వమని ఆరాటపడుతుంది..
ఆఖరుకి పండగ కవితల్లో కూడా ప్రజాజీవితాన్నే పరిమళీకరిస్తుంది.

ఏ దేశ ప్రజలకైనా భక్తి లేకపోతే నష్టం లేదుగానీ దేశభక్తి లేకపోతే
మాత్రం నష్టమే కాదు. మనుగడ సాగించటం కూడా కష్టమే అవుతుంది.
దేశభక్తి అంటే దేశంలోని సర్వసంపదల్ని, సర్వశక్తుల్ని ఆత్మీయతా భావంతో
ఆరాధించి కాపాడుకోవటం, మనిషిని మనిషిగా బ్రతకనివ్వటం, మానవ
త్వానికి పట్టం గట్టి చేతల్లో అభ్యుదయాన్ని పండించటం.

స్వార్థపరుల చేతుల్లో చిక్కుకుని మృగ్యమైపోయిన దేశభక్తిని
తలుచుకుని, అశాంతితో అలమటించే ఆధునిక జీవితాన్ని తలుచుకుని
జ్యోత్స్నారాణి గారు ఆవేదనతో రాసిన కవితలీ సంపుటిలో చాలా ఉన్నాయి.
స్వర్ణభారతం, నాయనమ్మపాట, వేదం సాక్షిగా, అశ్రుతర్పణం, గుడ్‌బై, నెత్తుటి
పువ్వు, కార్గిల్ సాక్షిగా, విజయభారతికి విజయోస్తు, ఎందుకో నా హృదయం
- వంటి కవితల్లో ఆధునిక భారతాన్ని జ్యోత్స్నగారు వర్ణించిన తీరు యదార్థ

రమణీయంగా ఉంది. రుద్రభూమిగా మారిన యీ బుద్ధభూమిని సానుభూతి గా చూస్తూ, నిట్టూర్పు గీతాలు తప్ప ఏమీ వినిపించని యీ కాలాన్ని గమనిస్తూ, కన్నీరు పెట్టుకుంటున్న కాశ్మీరాన్ని జోకొడుతూ జ్యోత్స్నగారు చెప్పిన కవితల్లోని ఆవేదనాగ్ని భవిష్యత్కాంతి పథం కాగలదని నమ్ము తున్నాను. అలిసిన కవితకు గమ్యం ఇలాగే ఉంటుంది. ఇది జ్యోత్స్నాతపం అని గమనించండి.

హైదరాబాదు - ఆచార్య తిరుమల
1.10.2001

# నామాట

వేదికలమీద చదివినవి, 'ఆంధ్రభూమి', 'వార్త', 'భూమిక' వంటి సుప్రసిద్ధ పత్రికలలో ప్రచురింపబడిన కవితలన్నింటి సమాహారమే ఈ కవన మందాకిని.

నిరంతరం శాంతి భద్రతల పర్యవేక్షణలో తలమున్కలవుతున్న శ్రీ సి.ఎన్.గోపినాథ్ రెడ్డి., ఐ.పి.ఎస్ గారు సాహితీవేత్త కావడం విశేషం. వీరు ఏ ఊరిలో అడుగుపెట్టినా ఆ ఊరిలో సాంస్కృతిక పండుగలు వైభవంగా జరుగుతాయి. కవులపట్ల కళాకారులపట్ల వారికి ఎనలేని అభిమానం. దశాబ్దానికిపైగా వారితో గల ఆత్మీయ పరిచయాన్ని పురస్కరించుకొని నేను ఈ 'కవన మందాకిని' కవితా సంపుటిని అంకితమిస్తున్నాను. నా కృతిని స్వీకరిస్తున్న వారి సహృదయతకు నా కృతజ్ఞతలు.

'కవితా శరచ్చంద్రికలు' అనే శీర్షికతో ఈ కవితా సంపుటికి అభిప్రాయం రాసిన మహాకవి కాలాన్ని గుప్పిటపట్టి సాహిత్య లోకానికి 'నానీలు' అందించి, వినూత్న ప్రయోగమార్గాలలో పయనిస్తున్న ఆత్మీయ కవివరేణ్యులు ఆచార్య ఎన్.గోపి గారికి,

నా కవితా సంపుటిని సమీక్షించి చక్కని చిక్కని అభిప్రాయం రాసిన 'కళాప్రపూర్ణ' డా॥ పోతుకూచి సాంబశివరావుగారికి,

'జ్యోత్స్నాతపం' శీర్షికతో నన్ను ఆశీర్వదించిన 'కవికౌస్తుభ' డా॥ ఆచార్య తిరుమల గారికి కృతజ్ఞతలు.

నిరంతరం వెన్నుతట్టి ప్రోత్సహిస్తూ, తన ప్రేమ దివ్వెను వెలిగిస్తున్న శ్రీవారు వి.వి. రమణగారికి కృతజ్ఞతలు.

ఈ సంపుటికి సహకరించిన శిష్యుడు 'దార్ల'కు నా అభినందనలు.

ఈ కవితలను పత్రికలలో ప్రచురించిన ఆయా పత్రికా సంపాదకులకు ధన్యవాదాలు.

కవితలను కంపోజ్ చేసి ప్రచురించిన శ్రీ సాయి శామిలి గ్రాఫిక్స్ వారికి, అందంగా ముఖచిత్రాన్ని అందించిన శ్రీ చిదంబరం గారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

**- శరత్ జ్యోత్స్నా రాణి**

# స్వర్ణభారతం

మరువలేని, మహాచిత్రంలా
గతం నాగుండెలను పులకింప చేస్తుంది
పదేళ్ళ ప్రాయంలో
స్కూల్లో మాష్టారు
జెండాని ఎగురవేసి సమైక్యత మన
జాతికి జీవం అన్నప్పుడు
చేతిలో చాక్లెట్టు పెట్టినపుడు
ఏమీ తెలియని నేను
మాష్టారిని తేరిపార చూసినపుడు
జెండా అంటే మూడు రంగులేనని
ముచ్చటపడ్డాను.
స్వేచ్ఛాఛత్రపు నీడలో
సేదతీరిన నేను
ఈ స్వర్ణోత్సవ వేళలో
స్వర్ణభారతికి అంజలిస్తున్నాను

స్వేచ్ఛా భారతం రావాలని
స్వరాజ్యం నా జన్మహక్కని
గర్జించిన తిలక్ నినాదాలతో
గురజాడ గరిమెళ్ళ గానాలతో
గాంధీజీ అహింసా వాదంతో
సిద్ధించిన స్వాతంత్ర్యం
నేడు సిగ్గు పడుతోంది
ఆంగ్లేయుల కుటిలనీతిని
అంతమొందించి
అంబారీపై ఊరేగిన నా దేశంలో
అందమైన కాశ్మీరం ఇప్పటికీ కన్నీళ్ళు పెడుతుంది!
అయినా....
సంధివచనాలతో కాలాన్ని
సర్దుబాటు చేస్తున్నాం!
శాంతికోసం
శ్వేతపావురాలను ఎగరేస్తున్నాం
ఆధిపత్యం మనదేనంటూ
అలీనరాజ్యాలకు
ఆది పీఠం వేసిన సుందరమైన నా దేశం
స్వాములతోను, స్కాములతోను నిండి
అనుక్షణం అణుబాంబుల్లా దద్దరిల్లుతూ

అవినీతి కుంభకోణాల రాజ్యంగా మారింది!
ఏబది సంవత్సరాలు నిండిన కర్మభూమిలో
కట్నాలకోరలకు, ఆహుతులయిన
మానవతుల ఆర్తనాదాల అగ్నిచిత్రాలు
అఖండంలో అలంకరింపబడుతూనే ఉన్నాయి
రామ్ రహీమ్‌ల సందేశాలు
గాలిపటాల్లా ఏ దిశకో మళ్ళిపోతున్నా
తలలుతెగిన మానవ దేహాలు
మందిరాలు, మసీదుల కోసం
మంతనాలు చేస్తూనే వున్నాయి!
నలుగురు మెచ్చుకున్న
నవభారతం నందనవనమే!
తెల్లవాడిని తరిమికొట్టిన
నల్లవాడి బానిసత్వానికి నిదర్శనమై నిలుస్తున్నా
బడుగువర్గాల బానిసత్వపు రేఖాచిత్రాలు
నిలువుటద్దాలై
నిట్టూర్పుగీతాలు వినిపిస్తూనే వున్నాయి
ఇదేనా స్వర్ణభారతం?
ఇదే ----- నా ----- స్వర్ణభారతం !!

(ఆగస్ట్ 15, 1997, 'కళాస్ఫూర్తి')



# అంతః శత్రువు

నన్ను చూసి నవ్వుతావు
నీ రూపాన్ని నింపుకున్నందుకా?
పదిమందిలో ప్రత్యేకంగా పలుకరిస్తావు
పిచ్చిమనసు నిండా
నీ రూపాన్నే దేవతలా ప్రతిష్ఠించుకున్నందుకా!
నా భుజాలపై పడిన నీ చేతి స్పర్శ
మాతృ ఒడిలోకి లాక్కుందునా!
అణువణువునా అమృతాన్ని నింపుకున్నాను
కానీ నీలో
నిలువెత్తునా గరళమే దాగుందని
తెలియని పిచ్చిదాన్ని
అతుకుల బతుకులో
నీమాట వెలుగుబాట అనుకొని
ఎన్నో కలలుకన్నాను

నీ చుట్టూ భ్రమరంలా తిరిగాను
పెదవి విప్పని నీ మౌనం
నా బాటకు ముళ్ళ బాటను పరిచింది
మనసు లేని నువ్వు
కృత్రిమ మనసుతో
కనబడ్డ ప్రతి చోటా అవే చిరునవ్వులు
చిలకరిస్తున్నావు
ఇంకా ఎందుకు
మానబోతున్న గాయాన్ని మళ్ళీ కెలుకుతున్నావు?

*(సెప్టెంబర్ 6, 1998 ఆంధ్రభూమి దినపత్రిక)*



# కాలాగ్ని

కంటిలో నలుసుపడితే
కన్నీళ్ళు పెడతావు
కన్నీటి బతుకులను చూసి
మండిపడతావు
మట్టిపిసికే మనుషులు
మారాజులవుతున్నారని
కన్నెర్ర జేయకు !

కలుపుతీసే కూలీలూ
కలాలు పట్టారని
కన్నెర్ర చేయకు మిత్రమా!
కన్నెర్ర చేయకు !

శివనామజపంతో అందరిని
మమేకం చేస్తావు
మాటల్లో ఎన్నడైనా ఎప్పుడైనా
"ఆ రెండు" పదాల స్మరణ మానేశావా మిత్రమా!

మనిషిగా ఏనాడైనా మనగలిగావా....
కాలాగ్నిలో కాలి బూడిదైన మట్టిమనిషి
కలిసి వచ్చేకాలంలో
కదిలివచ్చే జనచైతన్యం
ఒక యుగానికి వీడ్కోలు పలికి
మరో యుగానికి స్వాగతం పలుకుతోంది
కాలం ఒక నిత్యప్రవాహం
కన్నీర జేయటం వ్యర్థం మిత్రమా !!



# అగ్నిపాతం

జనారణ్యంలో జూలు విదిల్చే
మృగాన్ని మట్టుపెట్టండి
మానవత్వాన్ని మరిచిన మగవాడు
మృగమై మారణకాండకు ఉద్యమిస్తే
మూసిఉన్న మూడోకన్నూ తెరవండి
మానవుతులను రక్షించండి!
ఎక్కడైన, ఎప్పుడైనా
వీథుల్లో జరిగినా
విందుల్లో తగిలినా
విద్యాలయాల్లో పెనుగులాడినా
పోలీస్‌స్టేషన్‌లో పాలికేక పెట్టినా
ప్రేమ ముసుగులో మానాభిమానాల్ని దోచినా
తాళినెపంతో తల్లిని చేసివంచించినా
ఆ క్రూర మృగాలను వేటాడండి
అతివలపై అలవోకగా

అగ్నిపాతాలను (ఏసిడ్) కురిపించే
ఆటవిక ప్రవృత్తికి
అడ్డుకట్ట వేయండి!
పంజావిప్పే పురుషాధిక్యతకు
ఆటవిక ప్రవృత్తికి కాలం చెల్లేలా!
అరదండాలు వేయండి
దగాల మధ్య దగ్ధమయ్యే
అబలల కన్నీటి తుడిసి
అలసిన అక్కలను అక్కున చేర్చుకోండి !

*(వ్యవసాయ విశ్వవిద్యాలయం, హైద్రాబాదులో ఒక పైశాచిక ప్రేమికుడు అనురాధపై ఏసిడ్ పోసిన సంఘటనకు అశ్రునయనాలతో.....)*

*(భూమిక మాసపత్రిక సెప్టెంబర్ - అక్టోబర్ 96)*

# నాయనమ్మ పాటలో

ఆనాటి జ్ఞాపకాలతో
ఊగిసలాడే నాయనమ్మ
ఆ గీతాన్ని నాకోసం
పదే పదే పాడుతుంటుంది
ఆ పాటలోని ఉద్యమస్ఫూర్తి
నేడు మనం పాడేపాటలో లేదే?
అలముకున్న అంధకారంలో
అరుణోదయం కోసం
మూతబడ్డ అగ్నికళ్ళను వత్తులుగా వెలిగించి
తెల్లదొరల దురంతరాలను
తెగనరికిన వీరుల త్యాగఫలమే
నేటి స్వర్ణోత్సవం
నా దేశం కోసం
స్వేచ్ఛా గానం చేస్తాను
నవచైతన్యపు దీప్తులతో
నలుదెసలా జయవైజయంతికలను ఎగురవేస్తాను
సస్యశ్యామల దేశంలో
సగటు రైతుల ఆకలి చావుల వర్ణచిత్రాలు
రవివర్మ చిత్రాల్లా అలంకరింపబడుతున్నాయి!

అహింసావాదంతో
శత్రువులను తరిమికొట్టి
హింసావాదంతో మహాత్ములను పొట్టన బెట్టుకున్న
స్వతంత్రభారతం లో
ఇకనైనా....
శాంతికపోతాలు ఎగరాలి
నాకు తెలుసు
స్వేచ్ఛా భారతంలో ఐక్యత కరువై
కులమత విద్వేషాలను కాస్తా పక్కకునెట్టి
ప్రాంతీయ విభేదాల ఉరితాళ్ళను
బిగించుకుంటున్న
మానవాళిని పూర్చేదెవ్వరని
నాకు తెలుసు!
ప్రశ్నల బాణాలు దిగబడుతున్న ఆచారం లా
ఈనాటి స్వర్ణోత్సవాలను జరుపుకుంటే
అది ఆత్మ ద్రోహమే...
నేడు మనమంతా కలిసి పాడుతున్నాం....
అదేపాట....
అయినా...
నాయనమ్మ పాడుతున్న ఆ
వందేమాతరగీతమే నాకు మధురంగా విన్పిస్తోంది!



# వేదం సాక్షిగా ....

వేదాల సాక్షిగా వల్లిస్తున్నాను
పురాణాలపై ప్రమాణం చేసి
మరీ చెప్తున్నాను
కర్మభూమిలో కదిలివస్తున్న
నవరాత్రి ఉత్సవాలు కనులపండుగే
అయినా కనుమరుగైన ధర్మం !
నడుస్తున్న చరిత్రకు
అది చరమగీతం పాడుతోంది
ముసురుకున్న సమస్యలకు
మూల్యం చెల్లించలేదని
నా నగరం నన్ను చూసి నవ్వుతోంది
పక్షుల ఉషోదయగీతాలతో
ప్రతీ ఉదయం కళ్ళు తెరుస్తున్నా
స్వర్ణాంధ్రదేశంలోనూ
పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న

దొంగ స్వాముల ఉదంతాలు
మన కళ్ళకు కట్టే మసకతెరలు
అజ్ఞానపు భక్తికి అవే నిదర్శనాలు
నైతిక విలువలను
వలువలా విడిచేస్తున్న సమాజాన్ని
ప్రశ్నించిన అన్నాహజారే కూ
తప్పలేదు ఖైదు !

*29-9-98*



# తీతువు పాట

స్వాగతం ఎలా చెప్పమంటావు
సుస్వాగత గీతాలను
ఎలా ఆలపించమంటావు
వసంత కోకిల రాగాలకు దూరమై
తీతువుల రణధ్వనులతో
అంధకారంలో మునిగిన మా ఊరు
అందరినీ పోగొట్టుకొని ఆక్రోశిస్తుంది
మామిడి తోరణాలతో అలంకరించిన
ఆరోజును తల్చు కోమంటావా!
ప్రాణభీతితో చెట్లనదుముకున్న
కళేబరాల తోరణాలను చూసి
మురిసిపోమంటావా?
ఎన్నో వసంతాల హాయిలో
ఊయలలూగిన మా ఊరు
ఆమని అందాలకు దూరమై

వైధవ్యాన్ని అనుభవిస్తుంది
నవమాసాలు మోసిన కన్నతల్లికి
నగుమోములో నవ్వేది?
పడకలో పండుముదుసలి
పరమపదిస్తే సాగనంపేవారేరి?
పొలానికి పోయిన మగడు
పొలిమేరల్లో పడి ఉంటే ఆ
ఆడపడుచుల గుండెలు
ఆర్ద్రంగా మారితే
ఓదార్చే వారేరీలోకంలో....?
తుఫాను చేసిన బీభత్సం
మా ఊరినే ముంచేసింది
ఉలుకుపలుకు లేని నన్ను చూసి
నా ఊరు ఘొల్లున ఏడ్చింది
ఓదార్చలేని నా దేహం
నిలువెల్లా నీరై కరిగిపోయింది
ఇప్పుడు చెప్పు,
నా ఉగాది నేస్తం...నిన్నెలా ఆహ్వానించమంటావు?

(ఆంధ్రభూమి ఆదివారం)



# మరోసారి శిలువ

జన్మభూమి గీతాలు
జగతిని జాగృతం చేస్తుంటే
మట్టివాసన తెలియని మానవమృగం
మానవత్వం మీద ధ్వజమెత్తింది
ఉలుకు పలుకు లేని శిలలా
నిట్టూర్చే మంచితనం
మరోసారి శిలువ వేయించుకుంది!
జన్మభూమో
జన్మనిచ్చిన తల్లో
తెలియని అనాగరిక మానవమృగం
నవఅనాగరికతను నిలువెల్లా పూసుకున్న
పచ్చిమాంసపు వాసనలు
పరిసారాలన్నింటినీ కాటువేస్తున్నాయి.
సంస్కారపు సుగంధం అబ్బని
కుసంస్కారపు వేళ్ళతో

పాతుకున్న మఱ్ఱి చెట్టు ఊడలా
వ్రేలాడు తున్నాడు
ఆటవిడుపే తప్ప
అధ్యయనవిలువ తెలియని
మాతృభూమిని
మరుభూమిగా మారుస్తున్న
మానవ మృగానికి మరణదండన
తప్పదని హెచ్చరిస్తున్నాను.

*(విద్యాసంస్థను అప్రతిష్ట పాలు చేస్తున్న ఓ విద్యార్థి ప్రవర్తనకు...)*



# అశ్రుతర్పణం

చరిత్రపుటలను తిరగేస్తుంటే
గతించిన వీరుల త్యాగాలకు
నా తనువు పులకిస్తోంది!
తిరగబడ్డ తెలంగాణాపులుల పౌరుషాగ్నికి
మరోసారి నా గళం
శంఖారావం పూరిస్తోంది
ఏముందో మిత్రమా...
ఈ ధరిత్రిపై...!
పరరాజుల పాలనలో
మసిబారిన తెలుగు జాతి
పగిలిన గుండెతో
పోరాటపటిమతో
స్వేచ్ఛకోసం....సంస్థాన విముక్తికోసం
నడుంబిగించి నవచరిత్రకు
నాందిపల్కిన రోజే ఈ రోజు !
అదే హైదరాబాదు విమోచదినోత్సవం !!
కర్ణాటకలో పుట్టి మరాఠ్వాడాలో పెరిగి
తెలంగాణా గడ్డపై కాలుమోపి

తెలుగువారి వెలుగు కోసం
తపించిన మహనీయుడు
ఘనుడు రామానందతీర్థడిని
మనసారా స్మరిద్దాం...మౌనంగా అంజలి ఘటిద్దాం!
తెలుగు వాడల్లో
ఉర్దూపదాల వాడుకలో
తెలుగువారి ఉనికి మృగ్యమవుతున్న వేళ
ఉద్యమించి
తెలుగుపలుకుల్లోని తీయదనాన్ని
మనసులు చిలకరించే చిలుకపలుకుల కమ్మదనాన్ని
ఎలుగెత్తిన సంస్కర్త సారధులను
స్మరిద్దాం మరోసారి
ఏభైఏళ్ళ విమోచన స్వర్ణోత్సవాలలో
తెలంగాణా ప్రజాద్రోహి
నిజాంను మట్టుపెట్టి
తెలంగాణాజాతిలో జ్వాలామాలికలు రగిల్చి
చైతన్య దీపాంశులను వెలిగించిన
త్యాగధనులకు ఇదే నా అశ్రుతర్పణం!

*(బహుభాషా కవి సమ్మేళనం...హైదరాబాదు విమోచన దినోత్సవం,*
*రామానందతీర్థ జయంతి ఉత్సవాలు సందర్భంగా...)*

*(18-9-98)*



# గుడ్‌బై

గుడ్‌బై చెప్పేద్దాం
గతించిన కాలానికి
వర్తమానం నవగీతం పాడుతూ
ఆహ్వానం పలుకుతుంటే
గుడ్‌బై చెప్పేద్దాం!
ఎదలో ఎక్కడో ఏదో మూలలో
అప్పుడప్పుడు అన్పిస్తుంది...?
స్వాతంత్ర్యం వచ్చి
జెండాలు ఎగురవేస్తున్నా
జెండాలు - అజెండాలు తెలియనివారు
తిండికోసం అలమటిస్తూనే ఉన్నారని
అప్పుడప్పుడూ అనిపిస్తోంది!
తెల్లవాడిని తరిమిన గడ్డమీద
నల్లవాడి పాదం
శంబూకుల శిరస్సులమీద ఇంకా నర్తిస్తోందని
అప్పుడప్పుడూ కనిపిస్తోంది

ఓ ప్రక్క
కాలం గాయాలకు బలై
నెత్తుటికేకల మధ్య
బూడిదైన తాతముత్తాతల ఆత్మలు
నేటికి శాంతిగీతాలు ఆలపిస్తున్నాయి
అందుకే గతించిన కాలానికి
గుడ్‌బై చెప్పేద్దాం... గుడ్‌బై చెప్పేద్దాం!
ఓ మనిషీ....
నీవు గీసిన చిత్రంలో
విచిత్రంగా ఓ మూలలో ఒదిగిన ఓ వర్గం
వేదాలలో స్థానం పొందింది
వారి ఆనందహేల
మెరిసిన తారల్లా తళుక్కుమంది
మానవాళిని శాసించే నీవంటేనాకు ఆరోప్రాణం!
నిద్రలో జోగుతున్నా
నీ మేలుకొలుపు గీతంతో చైతన్యపరుస్తావు
నువ్వు నవవధువులా నడిచి వచ్చే కాలానివి!
నిన్ను ఆనందంతో అందుకొంటూ
నీలో కలలా కరిగి పోయే కలను నేను!

***(శ్రీ దామోదరం సంజీవయ్య దినోత్సవం సందర్భంగా కవి సమ్మేళనంలో....)***

14-2-99

# అంగడిలో నగరం

హైటెక్‌నగరంలో
విషసంస్కృతి మరో ముందడుగు వేసింది
నగరంలో నేడు
రంగు రంగుల తళుకుల మెరుపుల్తో
లభ్యంకాని వస్తువు లేదు మిత్రమా
పోటిపడుతున్న వస్తువులన్నీ
ఆకర్షణీయంగా కొలువుతీరాయి
ఉప్పునుంచి ఊరగాయ వరకూ
అప్పడాలనుంచి
అందమైన అమ్మాయిల వరకూ
అన్నీ తాజాగా దొరుకుతుంటే
నగరంలో క్రయ విక్రయాల జోరు
రంజుగానే సాగుతోంది!
అంగడిలో ఎన్ని చిత్ర విచిత్రాలు
ఓ మనిషి ఆకలికి అవయవాల్ని అమ్ముకుంటుంటే

మరోమనిషి
తన 'ఆకలి' తీర్చుకోవడానికి
వాటిని బేరమాడుతున్నాడు!
అవయవాల వ్యాపారం
స్టాక్ మార్కెట్‌లా పెరిగిపోతోంది
రత్నాలను రాసులుగా పోసిన గడ్డపైనే
పసికందుల అమ్మకాలు
'పసందు'గా ఫారిన్‌కు ప్రయాణమవుతున్నాయి
కాసులతో కన్నవారి కడుపుతీపిని
ఖరీదు చేస్తుంటే
పసిమొగ్గల పసిడి బ్రతుకులు
నగర సంస్కృతికి నవ్య వస్తువులయ్యాయి
ఈ అంగడిలో అన్ని ఉన్నాయి
ఆత్మీయత అనురాగాలు తప్ప!

'విధ్వంస నేపథ్యం' కవితాసంపుటిలో ప్రచురితం

(ఆంధ్రభూమి ఆదివారం)



# నెత్తుటి పువ్వు

నీ మరణవార్త నన్ను మౌనిగా మార్చింది
నెత్తుటిపువ్వులా మారిన నీ రూపం
నాలో మరోసారి
దేశభక్తిని రగిల్చింది

కనులు మూసుకున్నా
కలిసిపంచుకున్న జ్ఞాపకాలు
గాయపడ్డ గీతంలా
గానం చేస్తోంది !

ఈ దేశం నాదని
ఈ దేహం భరతమాతదేనని
మురిసిపోతూ పలికిన మాటలు
మరినేడు
వినపడని లోకాలకు
కనపడని తీరాలకు
కదిలి పోయాయని తెలిసి

ా హృదయం నీకోసం
అగ్ని గీతమై రగులుతోంది !

జాతీయ పతాకాన్ని కాల్చి
కాలుదువ్విన శత్రువుల్ని
శతఘ్నులతో ఏరి పారేస్తున్న వీర సైనికుడివి!
నీ ప్రాణాన్ని పణంగా పెట్టి
ఈ దేశద్వారానికి
కీర్తి తోరణమై మిగిలావు

అన్ని రాష్ట్రాలు అన్నదమ్ముల్లా
అన్నీ మరిచి అకుంఠిత దీక్షబూని
అమర జవానులను
అశ్రునయనాలతో స్మరిస్తున్నాయి
అలుపెరుగని నడకతో
ఆ పులికొండ (టైగర్ హిల్స్)పై
మువ్వన్నెలజెండాను ఎగురవేసిన
నీ సాహసానికిదే నా సెల్యూట్ !

*('యువ కళావాహిని' వారి కవితా సంపుటిలో 8-7-99)*

*(ఆదివారం ఆంధ్రభూమి)*



# కార్గిల్ సాక్షిగా...

ఎత్తైన శిఖరాలపై ఎగురుతూ
మంచుకొండల్లో మురిసిపోతూ
మువ్వన్నెల జెండా అంటుంది
'యుద్ధానికి సాక్షినని!'

కదన రంగంలో కన్నుమూసిన వీరజవానుల
కన్నతల్లి భారతి కన్నీళ్ళు తుడుస్తూ అంటుంది
'యుద్ధానికి సాక్షినని!
శాంతిపవనాలు వీచే నేలపై
అహింసా నినాదాలు ప్రవచించే (అగ్నిపాతం)
అఖండ భారతంలో
ఎక్కడా యుద్ధచ్ఛాయలు లేవు
అయినా.....
కాశ్మీరం కోసం కలల వలలెందుకో...?
ముమ్మారు తోకముడిచిన పక్కవాడు పాకిస్తాన్

పగబట్టి పోరుకి సిద్ధపడితే
కార్గిల్ కదనరంగం
తానే సాక్షినని అంటుంది!
భరత పులుల పౌరుషాగ్ని
మండుతున్న లావాలా
మంచుకొండల్లో మంటలురేపుతూ
సాక్షినని అంటుంది!
దుర్భేద్యమైన బాటలో
మంచుకొండల మాటులో
మాకోసం మీరంతా చేతులు కలిపి కదులుతుంటే
మీవెంటే మేమున్నామని
అమరులైన వీరులకు
అందిద్దాం అభినందన చందనాలు !!!



# నగరంలో ఓ చెల్లీ...

నవనవోన్మేష అందాలకు
నా నగరం నిలయం
కనువిందు చేస్తున్న దృశ్యాలతోపాటు
అకృత్యాలకు బలైపోతున్న అబలల చిత్రాలు
నడిబొడ్డులో నడుస్తున్న నాగరికతకు
అద్దాల్లా అగుపిస్తున్నాయి
ఏ దేశమైనా....ఏ కాలమైనా
ఎప్పుడైనా....ఎక్కడైనా
ప్రేమాస్త్రంతో బంధింపబడ్డ ఓ చెల్లీ
నయవంచకుల వలలో చిక్కిన ప్రేమమయికి
నగరంలో చోటులేక
అటూ ఇటూ తిరిగి అలసి సొలసి
ఓ అరుగుపై బెదురుచూపులు చూస్తుంటే
కలుక్కుమంది నా హృదయం !
ఎందుకో తెలుసా....ఆడదానినై పుట్టినందుకు!

ప్రపంచంతో పనిలేకపోయినా
ఆ చిరిగిన చీర కొందరికి అందాల్ని ప్రదర్శిస్తున్నట్లుంటే
ఆ చెల్లి మాత్రం తనలోకంలో తాను
మమతల పూలను ఏరుకుంటుంది!
ఆ పిచ్చితల్లి నావైపు చూస్తే
ఆర్ద్రమయింది నా హృదయం ఎందుకో తెలుసా?
అమ్మతనం నాలో పొంగినందుకు!
నా నగరం సరికొత్త రాగాలమేళవింపులతో
నాట్యాలు చేస్తూ అర్ధనగ్న సౌందర్యపు
అందాలపోటీలకు ఆహ్వానం పలుకుతుంటే
కనిపెంచినవారున్నా కనికరంలేని పేదరికం
కాటువేసిన ప్రేమ.....
ఓ చెల్లిని బలిపశువుని చేస్తే
మమతల మధ్య నలిగిన చెల్లిమనస్సు
నేడు
మరువలేని గాయంతో మూగవోయింది
గాయానికే మందు వేసినా
మాననంటుంది!



# కన్నీటి పూలు

తులసీ....!
నీలో నేనెన్ని రూపాలు చూసుకున్నాను తల్లీ....!
నీబుల్లి బుల్లి అడుగుల్లో
నీ వచ్చీరానీ ముద్దు ముద్దు మాటల్లో
నీ పసితనం చూసుకొని
నిండువెన్నెలతో ఆడుకుంటున్నట్లు
తన్మయం చెందేదాన్ని!
ఈ కంప్యూటర్‌యుగంలో
నగరంఅరణ్యమైన వేళ
మూఢవిశ్వాసం సింహంలా వచ్చి
నిన్ను బలికోరుకుంటే చూస్తూ నా హృదయం
ఎలా తట్టుకోగలుగుతుంది తల్లీ
వాడెవడో కాపలాకుక్క,
నిన్ను బలిస్తానని తన కుక్కుర్తి పడ్డ డబ్బుల్ని
నాకు విసరబోయినప్పుడు

గళ్ళా పట్టుకొని కొట్టిన నా చేతులు
నేడు నిస్సహాయస్థితిలో ఆకాశంలో నీకోసం
ఎవరినో ప్రార్థిస్తున్నాయి?
ఎటు చూసినా నీ రూపం తప్ప
మరెవరూ కన్పించని శూన్యం నన్ను వెంటాడుతోంది
నీ కన్నీళ్ళన్నీ పత్రికల్లో
సిరాలా మారిపోయి ఘోషిస్తుంటే
నా కలం నీకోసం కన్నీటి పూలను రాలుస్తుంది!
శ్రద్ధాంజలి నర్పిస్తూ!!

(కూకట్‌పల్లిలోని ఒక సినిమా థియేటర్ ప్రారంభోత్సవ సమయంలో
'తులసి' అనే ఒక గిరిజన అమ్మాయిని బలిగొన్నారనే 'వార్త'కు
స్పందించి...)

('భూమిక'లో ప్రచురితం)



# నవక్రాంతి

గతవత్సరపు గాయాలు మానకముందే
మందహాసపు వెల్లువలా
పౌష్యలక్ష్మి ఘల్లు ఘల్లున
గడప గడపకు వచ్చి పలుకరిస్తుంది
గంపెడాశలను గుండెల్లో నింపుతుంది
పల్లెపల్లెలో విరిసిన సంక్రాంతిశోభలు
పరుగులుపెట్టే నగరాల్లో మాత్రం మృగ్యం
కటౌట్లతో అయినా తారల తళుక్కులతో
చలనచిత్రోత్సవ వేడుకలతో
నగరం మెరిసి పోతోంది
నా జనం మురిసిపోతూనే ఉన్నారు?
ఆనందం వెల్లువలో తడిసిపోతూనే ఉన్నారు?
కోడి పందాల కాలం చెల్లినా
కట్నాల జోరులో కన్నవారి కడుపుతీపికి
బలవుతున్న పూర్ణమ్మ కథలు

వెతలను కలిగిస్తునే ఉన్నాయి
ఆకాశాన్ని అంటే ధరలతో కాలం
ఆకాశాన్ని తాకుతున్న ఫ్లాట్స్‌లో
పడరాని పాట్లు పడుతూ జీవనయానం,
వెలుగులేని ప్రతి ఇల్లూ
ఏడాదికోసారి మాత్రం
అందమైన ముగ్గులతో అలంకరించిన రంగవల్లులతో
కన్నెలనవ్వులవెన్నెలవాకిళ్ళలో
పండుగ పరమార్థాన్ని చాటుతుంటే
గొబ్బెమ్మలు కొలువై
నవరాగాల మాలికలతో వెల్లువిరిస్తోంది
నవక్రాంతి - సంక్రాంతి - శుభక్రాంతి !!



# విజయభారతికి విజయోస్తు !

పురివిప్పిన స్వేచ్ఛ నాడు బ్రిటిష్ వాణ్ణి తరిమికొట్టి
స్వేచ్ఛా పతాకాన్నెగర వేసింది
పతాక పండుగంటే పదిమందిని కలుసుకునే
మానవతావేదిక!
శాంతి సౌఖ్యం సహృదయాలతో
సహజీవనం సంకేతమై పులకరిస్తూ, పలకరిస్తూ
నిన్న జరుపుకున్న స్వర్ణోత్సవాల ఆనందం
పగవాడి గుండెల్లో
అమరనాథుని శూలందిగి
కార్గిల్ మంచుని మరింత పవిత్రం చేస్తోంది
ఎన్నికలే కదా ఏమీ పట్టించుకోరనుకొని
శత్రువు
తానుపొందిన అపజయాన్ని ఆక్రోశంగా చేసుకొంటున్నాడు
అయినా సమయస్ఫూర్తి గల
భారతపౌరులు ప్రతిస్పందిస్తూనే ఉన్నారు

బిడ్డల సమైక్యతనూ
సంసిద్ధతను అప్రమత్తతోను
హృదయం నిండుగా నింపుకొని
పండుగ చేసుకుంటూనే ఉంది!
పగవాడి గుండెల్లో నిద్రిస్తున్న విజయభారతి
ఈ స్వాతంత్ర్య దినోత్సవ వేళ.
ఆనందంతో పులకరిస్తూ పలకరిస్తోంది



## వృక్ష విలాపం !

ఏకాలమైన
ఏ ఋతువులోనైనా
నడిచే ఆ కాళ్ళు ఆ చోట
ఆ చలువ పందిళ్ళ కింద ఓ నిమిషం విశ్రమిస్తున్నాయి

ఎన్నోసార్లు ఆ దారంటా పోతూ
వస్తూనే ఉంటాడు
ఆ దారంటే ఆ బాటసారికెంతో ఇష్టం
ఆ చెట్లకు పూచిన పూలు
మల్లె సుగంధాలను వెదజల్లవు
మానవతా పరిమళాలనే అందిస్తాయి !

ఆ కొమ్మ పూలు రాలినచోట
పచ్చని కంబళ్ళు పరిచినట్లు రోజూ స్వాగతమిస్తాయి
ఆ దారంటే ఆ బాటసారి కెంతో ఇష్టం

ప్రతిరోజూ ఆత్మీయంగా అల్లుకున్నఆ కొమ్మల ఊసులు
వింటాడు
కొమ్మల పొత్తిళ్ళలోని ప్రేమానురాగాలు
అతనికి ప్రభాత గీతాల్లా వినబడుతూనే ఉంటాయి
ఆ దారంటే ఆ బాటసారికెంతో ఇష్టం
ఆలోచనా తరంగాల్లో మునిగి
అడుగులేస్తున్న బాటసారికి
ఓ పిలుపు....ఓ అలికిడి....
అడుగులకు బంధం వేసింది
ఆగి అటూ ఇటూ చూశాడు
ఎవ్వరూ కనిపించరే...
అతని అడుగులు బరువుగా ఆ చెట్లను సమీపించాయి
పెద్ద పెట్టున ఏడ్పు వినిపించింది
ఒక్కసారి పైకి చూశాడు
కొమ్మలన్నీ ఊగుతూ
శోకగీతాలతో ఆకులను అతనిపై రాల్చాయి
దాంతో కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి
'చూడు నేస్తం' అనే పిలుపు
'ఆ వైపు' అన్నమాట వినబడింది
ఆ వైపు చూశాడు
ఆ వరుస చెట్లేవి? ప్రశ్న మొదలైంది
ప్రగతి రథాలకింద నలిగినందుకు దుఃఖించాడు

చెట్టువైపు చూశాడు
చెట్టు పలుకరించింది - ఓ నిమిషం మిత్రమా
పుట్టిన ప్రతిమనిషీ ప్రతిక్షణం అలమటిస్తాడు
అందనివాటికోసం అర్రులు చాస్తాడు
అందితే ఆనందిస్తాడు
మరిమేం....జీవం పోసిన మనిషిని ప్రేమిస్తాం
అన్ని ఋతువుల్లోనూ ఆహ్లాదాన్ని కల్గిస్తాం
'ప్రపంచనేత సందర్శనం' మా ప్రాణాలను బలిగొంది మిత్రమా
రోడ్ల ముస్తాబులో కూల్చబడ్డ ఇళ్ళకు పరిహారం ఇచ్చారే?
కూకటివేళ్ళతో కూల్చబడ్డ మాజాతికేది నష్టపరిహారం?
అలసిన మనిషికింత అలసట తీర్చే మాకు
మీరిచ్చే మహాకానుక
మమ్మల్ని నరకటమే!



# ఎందుకో నాహృదయం...

ఎందుకో నాహృదయం
పలవరిస్తుంది నా హృదయం
ఎందుకోనేడు
ఎదలో ఉరకలు వేస్తున్న ఆనందాన్ని
అందరితోనూ పంచుకోవాలని
పాతచేదు అనుభవాల పునాదులపై
సరికొత్త పసిడి ఆశల భవంతులను నిర్మించాలని
పుడమిపై పాదం మోపిన
ప్రతి ప్రాణి పరవశించాలని పలవరిస్తుంది
నా హృదయం ఎందుకో నేడు!
సమస్యల సుడిగుండాలకు ఎదురొడ్డి
సహస్రాబ్ది చరిత్రలో మిగిలిన గుర్తులెన్నో
పేదరికం పల్లవిస్తున్న
పెదవి విప్పని బడుగు జీవులు
ప్రతిపూటా జ్వలించే ఆశలదీపాలకింద

నిదురరాని ఆకళ్ళకు
నవశతాబ్ది శుభాలను కల్గించాలని
పలవరిస్తుంది నా హృదయం
ఎందుకో మరి నేడు
స్వేచ్ఛా భారతంలో సంచరిస్తూ
మహాత్ముని అహింసా సిద్ధాంతాలకు నీళ్ళొదిలి
మానవ బాంబుల సంస్కృతికి
శ్రీకారం చుట్టామేమిటని
కలవరిస్తుంది నా హృదయం
ఎందుకో నేడు!
నేలతల్లిని నమ్ముకొని ఉన్నవన్నీ అమ్ముకొని
పండించిన పంట పురుగుమింగితే
పత్తిరైతుల దైన్యస్థితికి
కలవరిస్తుంది నా హృదయం
ఎందుకో నేడు!



# ఎక్కడా...కోయిల పాట!

కనుల ముందు కదలాడే దృశ్యాలు
కన్నీటి చిత్రాలవుతున్నాయి
మనసు మరోసారి
మౌనరాగాలను మీటుతోంది

అంతటా వసంతం విరిసినా
ఆమని కోయిల పాట కరువైనా
కవికోకిలల కంఠాలు మాత్రం
నేడు కదం తొక్కుతున్నాయి
ఆంధ్రదేశాన్ని చుట్టివచ్చావు కాబోలు
అలిసిన నీవు ఆదమరిచి ఉంటావు
అయినా.....
వసంతం నీకు స్వాగతం పలుకుతుంది
మాకోసం ఓసారి గొంతెత్తి పాడవూ
బతుకు పర్వంలో చితికిన

బడుగు వర్గాల గుండెల్లో రాగసుధలను నింపవూ!
పుడమిపై నడకలు నేర్చిన మనిషి
నరుకుతున్న ప్రతి చెట్టూ
నరాలు తెగి విలపిస్తున్నాయ్
పచ్చదనం నశిస్తుందని ఆక్రోశిస్తున్నాయ్

అదిమిపెట్టినా అవకాశవాదుల ఆగడాలు
మరో అడుగు ముందుకు వేస్తే
శాంతికోసం నాల్గడుగులు వేసిన నీకు
నడిరోడ్డు మీద హత్య బాకై గుచ్చుకుందా....
ఎక్కడా ఆ కోయిల పాట....

మోయలేని ధరల బరువు మోపెడై
సామాన్యుడు సగమై
డూడూ బసవన్నలా మారాడని...
దాగిన కోయిల మౌనంగా

మగవాడి చేతలను
మౌనంగా భరించి
మాతృత్వపు మమకారం
ఆడపిల్లను అంతంచేస్తే
అనాగరిక సంస్కృతిని స్వాగతం పలుకలేక....

కుసంస్కారపు బాటలో
మతోన్మాద వేటలో
మనిషే మృగమై
మారణకాండ సల్పితే
ఎక్కడా.....ఆ కోయిల పాట

ఓ కోయిలా -
పరమత సహనాల సువాసాలను నింపుకున్న
ఈ మట్టిలో ఏముందో మహిమ
మేమంతా ఒక్కటేనని
కలిపి వసంత గానం ఆలపించేలా
నీ పాట మాకు మేల్కొలుపు గీతం కావాలి
పగిలిన హృదయాన్ని పదిలపర్చుకో
పగలున్నా పది మంది కోసం పాటపాడు
నీ పాట నా కవితకు పల్లవి
నీరాక మాకో సందడి !!

ఆకాశవాణి, హైదరాబాద్ కేంద్రం
ఉగాది కవి సమ్మేళనం 2001
('వార్త' దినపత్రికలో ప్రచురితం)



# నా స్మృతిలో

ఒక్కసారి నీ రూపు
అలా జ్ఞప్తికి వస్తే
నీ మంచి తనం తళుక్కున మెరిసింది తారలా
మిత్రమా
మరణించిన ప్రతివాడు
పరమ పదం పొందలేడు
మనలో మనవాడై
మనగలిగిన నాడే,
ఈ స్మృతికి దూరం కాలేడు!
అందుకే నీవు
కళ్ళముందు లేకున్నా
కళా కారుల కళ్ళల్లో
వెలుగు రేఖ వయ్యావు!
పేరులోనే ఉంది కళ
అందుకేనేమో

కళలకు అంకితమయ్యావు
చివరకు
కళాబంధువుననిపించుకున్నావు
నీవు నడయాడిన 'గాన సభ'
నిను మరువలేక
నీకోసం నిలువెత్తు దండై నిలబడింది చూడు
తెరచిన గానసభ తలుపులు
నీతలపులతో తలమున్కలై నీ
ఆత్మకు శాంతివచనాలను అందిస్తున్నాయి
నాకు తెలుసు - మిత్రమా!
ఇక్కడే ఏ మూలో కూర్చుని ఉంటావు
మా కవితలు నిన్ను
మైమరిపిస్తాయి
కనిపించని నీ వదనం
వినిపించని నీ పలుకు
సుదూర తీరాలకు తరలివెళ్ళిన
కళాసీమలో ముందున్నావు
కళాభిమానుల కళ్ళల్లో నిండిపోయావు
మంచితనాన్ని
మణిహారంగా
ధరించిన
అమృత మూర్తివి

నీ స్మృతి మా హృదయాల్లో చిరంజీవి
'లలితకళాప్రపూర్ణా......!
అందుకోవయ్యా మా నీరాజనాలు

*కళా సుబ్బారావు 4వ వర్ధంతి సందర్భంగా కవి సమ్మేళనం*
*(కళా సుబ్బారావు స్మృతిలో)*



# విషాద స్వప్నం

ఓ మనిషీ
ఎక్కడికి ఆ పరుగు
ఎంత దూరమని పరిగెడతావు
ప్రాణాలను గుప్పెట్లో బంధించి
వడివడిగా అడుగులు వేస్తూ
నడక నేర్పిన నేలతల్లిని దాటి
వెంటాడే మృత్యువును
ఎలా తప్పించుకుంటావు
ఎంత దూరమని పరిగెడతావు
ప్రపంచపటంలో పదిలంగా ఒరిగావు
పంచభూతాల ఆగ్రహాల అనుగ్రహాల
అలకలకు అప్పుడప్పుడు బలికావలసిందే
అనుకోని అఘాతం
భూకంపం రూపంలో
గుజరాతు ప్రజల్ని దుఃఖితుల్ని చేసింది

కంపనల ప్రకంపనల నడుమ
ఓక్షణం ముగిసిన నరమేధం
జాతికి మిగిల్చిన విషాదస్వప్నం
ఆ ఛాయలకు దూరంగా సుదూరంగా
ఎంత దూరమని పరిగెడతావు

ఆదమరిచి నిదురించే
అమ్మ ఒడిలో ఊసులాడే
పసికందు పట్టుతప్పి
ఫెళఫెళ లాడుతూ విరిగిపడ్డ
స్తంభాల నడుమ నలిగిపోతే
తల్లి లాంటి భూదేవి
తన బిడ్డలను తానే బలిగొంటే
ఎవరిని ప్రశ్నించాలి! ఓ మనిషీ!
ఎంతదూరమని పరిగెడతావు
అల్లుకున్న అనురాగబంధాలు
పెనవేసుకున్న ప్రేమ బంధాలు
తెగిన గాలిపటంలా ఎగిరిపోతే
తపిస్తున్న తనువు స్థాణువవ్వదా
చూస్తున్న కళ్ళు చెమ్మగిల్లవా?!



# తెలుగు పలుకు

తెలుగు పలుకు మనదేనని
తెలుగు వెలుగు నింపుదాం
చిలుక పలుకు మనదేనని
తెలుగువారి చెలిమిని చాటుదాం

తేట తేట తెలుగు మనదేనని
మనమంతా కలిసిపాడుదాం
మాతృభాష వైభవాన్ని
నలుమూలల చాటుదాం

మన భాషను మెచ్చెనోయి అల
రాయలు మురిసెనోయి
దేశ భాషలందు తెలుగులెస్సయన్న
తెలుగు మాట మిగిలెనోయి!
నన్నయ నడకతో

నిలబడ్డ తెలుగుభాష
సినారే చేతిలో
చిగురించిన నవ్య భాష
వెయ్యేళ్ళ తెలుగు నేడు
వెలుగుతోంది విదేశాలలో...

తెలుగువాడి పలుకు
ఎచ్చటనైన చిలుకు సుధలు
అందుకే నేనంటాను
అందమైన తెలుగు మనదని
అపరంజి తెలుగు మనదేనని

మనసారా పాడుదాం
మరోసారి కలిసి పాడుదాం
తెలుగు పలుకు మనదేనని
తెలుగు వెలుగు నింపుదాం
తెలుగువారి చెలిమిని చాటుదాం

*ఆస్ట్రేలియా వారి 'తెలుగు' పలుకు పత్రికలో ప్రచురితం జూలై 1988 (ఆకాశవాణి, హైదరాబాదు (యువవాణి తెలుగు)లో ఈ గేయం ప్రసారం)*



# అతడు

అతడంటే గౌరవమే అందరికి!
మంచి తనాన్ని దుశ్శాలువుగా ధరించినవాడు
భూమ్యాకాశాలకు నిచ్చెనవేసి
స్వర్గాన్ని కళ్ళముందుంచేవాడు
మాటల్తో మసి పూసి
చేతల్తో విషాన్ని తినిపిస్తాడు
అతడంటే గౌరవమే అందరికి!

రోజూ 'ఇజాలు' మాట్లాడే నోటితో
ఏరోజూ నిజాలు పలుకడు!
స్వార్థ నాయకుల సృష్టే 'కులమని'
భాస్వరంలా భగ్గు మంటుంటాడు!
కుయుక్తులతో
కులానికి పీఠం వేస్తాడు
అతడంటే గౌరవమే అందరికి!
పదిమంది మెచ్చుకుంటే

నొచ్చుకుంటాడు
పథకం పారినందుకు
ప్రతిక్షణం పరవశిస్తాడు
అతడంటే గౌరవమే అందరికి!



# ఈ శతాబ్ది మహర్షి!

ఓ మహర్షి
ఓ మహామనీషీ!
పొగడ్తల మల్లెగొడుగు కింద
మైమరచి నిద్రిస్తావు
అలవోకగా పీఠాలపై
అధిష్టిస్తావు
అదను దొరికితే
వామనుడిలా
అణచివేస్తావు!
ఓ మహర్షి!
ఓ మహా మనీషీ!

నవ్వే పెదవులతో
శత్రువుపైకి లంఘిస్తావు
చేతులెత్తి నమస్కరిస్తే

ప్రాంతీయతనే మరచి
అక్కున చేర్చుకుంటావు

చిరునవ్వులతో
విష బిందువులను
చిలకరిస్తావు
అనుగ్రహిస్తే
భువిలో వెలసిన 'బాబా'లా
వరాలిస్తావు
ఆగ్రహిస్తే
సుక్షేత్రాన్ని
కురుక్షేత్రంగా
చేస్తావు -
అతడే సుమా!
ఈ శతాబ్ది 'మహర్షి' !
మరులు గొన్న మహర్షి
మనసులేని
మర మనిషి!!

22-9-2001

# గుండె గాయం

ఎవరి కోసం ఆ నిట్టూర్పులు,
స్థాణువై సమస్తాన్నీ విస్మరించి
ప్రగతిలేని సమాజంలో
పొగిలి పొగిలి ఏడుస్తావు!
ఆగని కన్నీళ్ళకు అంతులేదు
ఆరని మంటలకు అవధుల్లేవు
మమతకు అద్దం పట్టే మనిషిలో
కాటువేసే కర్కశత్వం
ఉరకలు పరుగులు వేస్తుంటే
ఉగ్రవాదం ప్రభంజనంలా
ప్రపంచాన్ని చుట్టేసిందనా...?

నీ వెవరో నాకు తెలుసు
నే నెవరో నీకు తెలుసు
నీ నా మధ్య

రగిల్చిన చితిమంటలు
రావణ కాష్టంలా
విరబూసిన స్నేహలత
వాడి వీడి పోయిందనా...?

ప్రగతి లేని సమాజంలో
పొగిలి పొగిలి ఏడుస్తావు

నిత్యం భయం గుప్పెట్లో
అనునిత్యం అశాంతి
రెచ్చగొట్టే రౌడీ రాజకీయాలు
రామ భూమిలో
రాక్షస తాండవమాడితే
బుద్ధభూమి రుద్రభూమిగా
మిగిలి పోతుందనా .....?

ప్రగతి లేని సమాజంలో
పొగిలి పొగిలి ఏడుస్తావు!

మహాత్ములను మట్టుపెట్టే
మలిన సంస్కృతిలో భాగం...
ఆనాడు ఇందిరమ్మను

ఈనాడు పూలన్‌దేవిని
నడుస్తున్న చరిత్రలో
అర్థం కాని అవగాహనలేని
అరాచక వాదంతో
ఎంతమందిని బలిస్తాం!
మరెంత మందిని బలిగొంటాం !
గుండె గాయానికి మందు
తుపాకి గుండేనా పరిష్కారం !!

21-9-2001



# సుమాక్షరాలు

ఆలోచనల రూపమే అక్షరం
అక్షరాలు దిద్దని పసిపాప
అమ్మా అనిపిలుస్తుంటే
అక్షరాలు నేర్చిన మనిషి
అవినీతి పరుడవుతున్నాడు
రక్తంతో తడిసిన వసుధమీద
సహనాన్ని కవచంగా ధరించి
సమతా బీజాక్షరాలను నాటి
సర్వమతాల సారం ప్రేమేనని
నలుమూలలా చాటిస్తాను
సమ సమాజాన్ని నిర్మిస్తాను
అలసిన హృదయాలపై
అమృత ధారలను కురిపిస్తాను !

# పుణ్యభూమి

అందాల అనుగుతల్లికి అంజలిద్దాం
పసిడి పంటల పాలవెల్లిని పలుకరిద్దాం
పదం పదం కలిసి పాట పాడుదాం
పది మందికి మనగీతం వినిపిద్దాం !

నిదురించే తెలుగన్నా లేచిరా
వినిపిస్తున్న గీతాన్ని ఆలపిస్తూ
పదరా ముందుకు తెలుగన్నా
తెలుగుతల్లి పిలుస్తుంది ప్రేమమీర
తెలుగు నేల నగువులు చిందేలా
స్వాగతమిద్దాం!
పదరా ముందుకు తెలుగన్నా
తేటతేట తెలుగు మనదన్నా
తేనెలూరే తెలుగు మన బాసన్న
తెలుగు కైతలకు కాణాచి ఈ నేలన్నా
తెలుగు తేజానికి మాగాణి ఈ పుణ్య భూమన్నా!

అలనన్నయ తిక్కన ఎర్రన
తెలుగు బాసకు వయ్యారపు సాక్షిగా
నడకలు నేర్పిన కవులు! వీరేనన్నా!

అల్లసాని అల్లిక జిగిబిగి
కవనం మనసొత్తన్నా
కందుకూరి గురజాడ జాడల్లో పయనిద్దాం
జాతి జాగృతికి ఆదర్శం వీరేనన్నా!
ఆటవెలదుల్లో ఆశుకవిత్వాన్ని
అన్ని దిశల అందించిన వేమన్నను మరువద్దన్నా

ఆంధ్రులకోసం అమరుడైన
పొట్టి శ్రీరాములు పుట్టిన ధరిత్రి మనదన్నా!
పగవారి గుండెల్లో నిదురించేతూట
మన అల్లూరిని ప్రసవించిన పసిడి భూమన్నా!
శౌర్యానికి ధైర్యానికి తెలుగువాడు ప్రతీకయని
నిర్భయంగా ఎలుగెత్తిన ధీరుడు
తెలుగువారి అన్న తారక రామన్న
వీరంతా మన వాళ్లేనన్నా!
సంగీత నృత్య సాహిత్యాల సంబరాలతో
అంబరాన్ని అలరించిన మన సంస్కృతి
కృష్ణా గోదావరి తుంగభద్రలా
పరవళ్ళు త్రొక్కి అలల్లా ప్రవహిస్తూ

ప్రపంచ దేశాలు ప్రశంసించేలా
ప్రపంచ వీధుల్లో రెపరెపలాడుతున్న
తెలుగు జెండాని చూడరా!
చెయ్యెత్తి జై కొట్టు తెలుగన్నా !!
పదరా ముందుకు తెలుగన్నా !!!

*('తెలుగు జగతి' 1996లో ప్రపంచ తెలుగు సమాఖ్య ద్వితీయ మహాసభల ప్రత్యేక సంచికలో ప్రచురితం)*



# నేను

పద్యకొమ్మకు పూచిన పూబంతిని
కవితావనంలో విరబూసిన వెన్నెలను
'కొత్తపాట'తో గళం విప్పిన నవకోకిలను
'మందాకిని'లా ప్రవహిస్తున్న కవనజ్యోత్స్నను !



# కొన్ని నానీలు

కూల్చడానికి
ఉపాయాలెందుకు?
ఒక్క
కరపత్రం చాలదా?

చితికీ సతికీ
నిప్పా?
చట్టాల్తో ఆపు
అదే గొప్ప తమ్ముడూ !

కలహానికి
ఆయుధం కావాలా?
పలుగులాంటి
పలుకు ఉండగా !

పుటల్లో
మానవత్వాన్ని పొదుగు
ఇలలో
దానవుడుగా జీవించు!

ప్రేమ
మనసులను కలుపుతుంది
కులం
మందలను కలుపుతుంది -

నీడ నిచ్చానని
చెట్టు పరవశిస్తుంది
బదులుగా దాన్నే
నరుకుతున్నాడు !

మాటలోనే
పూచేది మానవత
మరి చేతల్లో
దానవత !

చెట్టు కాదది
పచ్చదనానికి మెట్టు
ఎందుకు
గొడ్డలి పెట్టు !!